Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] మద్రాసు : 1942 వ సం॥ ఫిబ్రవరి నెల 20 వ తేది శుక్రవారం [నె 7 రు.

## ఈ వారంలో యుద్ధం.

### సింగపూరు పతనం—జావా-సుమత్రాల పోరాటం—అమెరికా యుద్ధ నౌకల రాక—ఆస్ట్రేలియా నడుంకట్టుట—

### బర్మా యుద్ధం—రంగూనుకు 105 మైళ్లలో శత్రువు—6 రోజులకు 60 మైళ్లు.

సింగపూరు పడిపోయింది. జపానువారే అంగీకరించినట్లు ఆ ద్వీపమును కాపాడుచుండిన భారతీయ, ఆస్ట్రేలియా, బ్రిటిషు సైనికులు మానవ సహజమగు ఓర్పుకుమించి, 8 దినములు యుద్ధం చేసిరి. కాని చాల సైన్యాన్ని గోల్పోవుటచేతను, నీరు, ఆహారము, మందుగుండు, పెట్రోలు చాలకుందునను సేనానాయకుడగు జనరలు పెర్సివాలుగారు, రక్షించుకొనుట అసాధ్యమని నిశ్చయించి, ఆది వారం రాత్రి లొంగిపోయిరి. మరునాడుదయం జపాను సేనలు సింగపూరు నగరం ప్రవేశించినవి.

ఈ ఓటమి తక్కువదని ఎవ్వరనలేరు. చర్చిల్ గారే స్పష్టంగా తెలిపినట్లు చాలదూరపు ప్రతిక్రియలుండు గొప్ప సైనిక పరాజయమిది. అయితే, యిందుగూర్చి భీతి చెందవలసిన పని లేదు. మలయా ద్వీపకల్పంనుండి సైన్యాలను సింగపూరు ద్వీపానికి మార్చినపుడే, విషయమెరింగిన వారు సింగపూరు పడిపోవుటకెన్నో రోజులు పట్టదనిరి. ఈ ద్వీపం రక్షణలగూర్చి విపరీతంగా యిదివరకు ప్రకటింపబడినప్పటికిని సైనిక దృష్టిలో అది నిజమగు దుర్గముకాదు. అది నిజంగా చక్కని ఘట్టి నౌకాదళ కేంద్రమే కావచ్చును గాని, దానికి చేరువనే జపానువారి విమానదళ కేంద్రములుండుటచేతను, మిత్రమండలి నౌకాదళ సహాయం తగినంత లేకుండుటచేతను సింగపూరు ఉపయోగించకుండెను. బ్రిటిషు యుద్ధ నౌకలు ప్రిన్సు ఆఫ్ వేల్సు రిపల్సు మునిగిపోవుటచేతను, సమయానికి అమెరికా పసిఫికు నౌకాదళం సింగపూరు రక్షణకు రాజాలకపోవుటచేతను యిట్లయ్యెను. ఘట్టి పునాదులులేకుండా కట్టిన యిల్లువలె నైంది సింగపూరు స్థితి. నిజంగా అడుగురాల సింగపూరు నేల ఘట్టి రాయివంటిదిగాక, బురద నేలగ నుండును. జిబ్రాల్టరు, కోరిడారులో (మనీలా ఎదురుగ) వలె సహజరక్షణ యేర్పాటు లేమియు లేదు.

జపాను సేనలు బోర్నియోనుండి [illegible]గా సుమత్రాలోని పలెంబాంగువరకు వచ్చి, సింగపూరు మార్గనిరోధం [illegible]చే సింగపూరు నుండి సైన్యాన్నిగాని, సామగ్రినిగాని డంకిర్కు, గ్రీసు, క్రీటులనుండి తప్పించినట్లు తప్పించ వీలు లేకపోయినదని యిపుడు తెలిసినది. వైమానికులును, నేల పనివారు తప్పించుకొనిరి. కాని నేల సైన్యమునకు చాల నష్టంకలిగి విశేషంగా ఆయుధ సామగ్రి పోయియుండును. నౌకాదళానికిగూడ కొంత నష్టం కలిగియుండును. వెడలిపోవు లోపున పనికివచ్చే వస్తువులన్ని ధ్వంసం చేయడం జరిగింది. కాని సింగపూరు జపానువారికి మంచి రక్షణగల నౌకాశ్రయంగా ఉపయోగపడగలదు. దీనిని ఉపయుక్తమగు నౌకాదళ కేంద్రంగను విమాన శిబిరంగా వారు మార్చుకొనగలరు.

### జావా-సుమత్రాల యుద్ధం.

అంతట జపానీయులు సుమత్రా ఉత్తర భాగమున స్థావరమేర్పరచుకొని మలాకా జలసంధిని వశపరచుకొని, హిందూ మహాసముద్రం రంగూనులకు నౌకా మార్గమును స్వేచ్ఛగ నుంచుకోగలరు. సిలను ఆస్ట్రేలియాలకు మధ్యనున్న మిత్రమండలి ప్రధాన శిబిరమిపుడు జావాలో నుంది. దీనిపై జపాను దాడిచేయుటకు సదుపాయమయింది. అపుడే వారు సుమత్రా దీవిలోని ముఖ్య చమురు గనులుగల నగరం పలెంబాంగును వశపరచుకొనిరి. కాని, బోర్నియోలో బలికుపాపను లోవలనే యిచటగూడ డచ్చివారు చమురు కట్టడములన్నింటిని పూర్తిగ తగులబెట్టి, చమురు వూటలుగూడ యిదివరకువలె రాకుండా పాడు చేసిరి. ఆదో మంచిపనే. ఈ విధ్వంస విధానంవలన డచ్చివారు మొత్తం 1,250 పౌనులు త్యాగంచేసిరి. అంతకు ముందే జపాను సైన్యం 700 మంది విమానాలనుండి గాలిగుమ్మటాలలో దిగిరి. కాని డచ్చి బ్రిటిషు విమానాలు వారందరిన్ని నాశనం చేసినవి. అంతకన్న శత్రువుల సముద్రంలో స్టీమరుపైవచ్చి జయప్రదంగా దిగగల్గెను. సుమత్రా 1,000 మైళ్ళు పొడవుగల దీవి. పెలెంబాంగు చేరినప్పటికి జపానువారు సుమత్రా ఉత్తర శిఖరమునకు 800 మైళ్ళ దూరములో నుందురు. ఈ [illegible] పూర్తిగ అభివృద్ధికాని ప్రదేశము. ఇట్టి పరిస్థితులలో డచ్చివారికి యితర చోట్లనుండి విమాన సహాయం వచ్చుట ఎంత అవసరమో నౌకాదళం వచ్చుట గూడ అంత అవసరం. జావాకు యిపుడు అతివడిగ వస్తున్నాయని చెప్పబడుచున్న క్రొత్త సైన్యసహాయంలో నౌకలుగూడ వచ్చుచున్నచో ఎ.బి.సి.డి. రాజ్యాల నౌకాదళ నాయకుడయిన అడ్మిరలు హాఫ్రిచ్చిగారు వాటిని బాగుగ ఉపయోగించి గెలుపొందగలరు. వీరు యీ దీవిని పూర్తిగ ఎరుగుదురు. రక్షణకొరకు శత్రువుపై దాడిచేయుట గూడ ఒక సాధనమే యని వారి నమ్మకము.

### జావాకు అమెరికా సేనలు.

జావాలోనికి అమెరికా సేనలు, ఆస్ట్రేలియా సేనలువచ్చుట శుభసూచకము. అవి సమయానికే వచ్చినవి. సుమత్రా పడిపోయినచో అది జావాపై దుముకుటకొక మెట్టుగ శత్రు ఉపయోగించుకోగల్గును. డచ్చి తూర్పు దీవులన్నింటిలోను జావా చాల భాగ్యవంతమైనది, జనరలు వావెలు గారికి కేంద్ర నివాసస్థానం. తూర్పు దీవులలో మిత్రమండలికి మిగిలియున్న ఏకైక నౌకాదళ శిబిరము. జపాన్ను తీవ్రంగా ఎదిరించుటకు వావెలు సేనాని యిక్కడనే సర్వ ప్రయత్నములు చేయుచున్నాడు. సింగపూరును రక్షించుట అసాధ్యమని తెలిసినపుడే యీరీతి నిర్ణయింపబడెను. ముట్టడిచేయబడిన కోటవలె జావా ఉండిపోదు. జపానువారిని తిరుగగొట్టుటకు తిరుగు దాడులు జరుపుటకు ప్రధాన కేంద్రముగ నుండగలదు. ఈ లోగా, అమెరికా యుద్ధనౌకలు న్యూజిలండునకు వచ్చినవి. శత్రువును యిపుడాతడు ఆక్రమించిన దేశాలనుండి తరిమివేయగల పెద్ద సైన్యం ముందురానున్నది, దానికిది తొలిజట్టని అమెరికా మంత్రి కర్నలు నాక్సు గారు చెప్పిరి. అమెరికా నౌకాదళము యిటీవలనే మార్షలు దీవులు గిల్బర్టు దీవులపై జయప్రదంగా దాడిచేసెను. అందుచే అమెరికను సప్లయి మార్గము హవాయిదీవినుండి న్యూజీలండువరకు, అటునుండి ఆస్ట్రేలియావరకు నిరాటకంగానున్నదని తెలియగలదు. ఈ మార్గములోనున్న శత్రుస్థానము

ంను నిరుపయోగ మొనర్చుటకే అమెరికను లుద్దేశించిరి. జావాకు తూర్పు యిప్పుడు మూడువేపులనుండి గలదు. ఒకవైపు సుమాత్రానుండి, యింకోవైపు బోర్నియో సెలిబీసు దీవులందున్న శత్రు శిబిరాలనుండియు. ఇదిగాక బోర్నియో ముఖ్య పట్నమును, సౌరబాయా కెదురుగా జావా సముద్రము ఆవలివైపునున్న బెంజరిమాసినుగూడ యిపుడు జపాను వశమయినవి. కావున జావా రక్షణ కష్టమే, అయినా యీ చీకటి మేఘాలలో ఒక ఆశాకిరణం లేకపోలేదు. అమెరికావారి ఫిలిప్పైన్సులో మకార్థరు సేనాని యింకా నిలువరించుకొనియుండి జపానాక్రమించిన మనీలా నౌకా కేంద్రమును అది ఉపయోగించకుండ ఆటంకపరచుచున్నాడు. యుద్ధం ప్రారంభమైనప్పటినుండి 90 శత్రు నౌకలు ముంచబడినవి. అమెరికా నౌకా దళము ఆస్ట్రేలియాలో స్థావరముండి శత్రువుపై దాడి ప్రారంభించగలదు.

### ఆస్ట్రేలియా సిద్ధమగుచున్నది.

ఆస్ట్రేలియా తన బాధ్యతను బాగా గుర్తించినదనుటకు నిదర్శనంగా ఆదేశమునందలి ప్రజలందరు సైన్యంలో చేరుటకు తగిన చర్యలు గైకొనబడెను. దేశంలో సంపదయంతయు దేశరక్షణకు వినియోగింప నిశ్చయించిరి. ఉత్తరముననున్న న్యూగినీ సైనికాధికారంక్రింద నుంచబడినది. అచటనున్న సర్వసేనాధికారి మేజరు జనరలు మారిసుగారు, అందలి ప్రధాన రేవుస్థలమగు పోర్టు మోరస్లీని అవసరమయితే పశిఫికు ప్రాంతముల టోబ్రుకువలె చిరకాల ముట్టడికి సిద్ధంచేయుదుమనిరి. అది ఆస్ట్రేలియా స్వాధీనముననున్నచో జపాను సేనలు దక్షిణానికి రాకుండ అడ్డగలదు. ఆస్ట్రేలియా న్యూగినీల మధ్యనున్న టారిసు జలసంధికి ద్వారంవలె నుండగలదు. అక్కడ నౌకా మార్గము మారస్లీ రేవు ఎవరి చేతులోనుంటే వారి స్వాధీనమునందుండును.

### బర్మా యుద్ధం.

కొద్దిరోజులు మందంగానున్న పిదప బర్మాలో యుద్ధం తిరిగి ప్రజ్వలించింది. జపాను సేనలు సాల్వీను నదిని పాన్ నగరంవద్ద దాటినవి. ఇది మర్టబను రేవునకు 25 మైళ్లు ఉత్తరంగా నుంది. పాన్‌నకు 25 మైళ్లు పడమరగనున్న రైల్వేకూడలి స్థలమగు తాటను నగరముపై దాడిచేయుటకు వారు ప్రయత్నించుచున్నారు. పాన్ వద్ద భారతీయ సేనలు జపాను సైన్యానికి చాలనష్టం కలుగజేసినను గూడ, తిరిగి సైన్యాన్ని కూడదీసి డుయింజీకు, తాటను నగరాలపై దాడిచేయుటకు జపాను ప్రయత్నించుచున్నది. డుయంజీకు తాటనుకు ఈశాన్యంగా 6 మైళ్లు దూరంలోనుంది. దొంతామినది వొడ్డున గలదు. ఈ నది దక్షిణంగా ప్రవహించుచు మర్తబనువద్ద సాల్వేనునదిలో కలియుచున్నది. తాటనుకి డుయింజీకునకు రోడు గలదు. జపానువారు దొంతామినదిని యిచట దాటగలుస్తే తాటనుకి ముప్పే. తాటానునకు దక్షిణంగానున్న మన సేనలకు ఎడమవైపునుండి వచ్చి కొట్టుటకు సేనలను దొంతామినదిమీదుగ దక్షిణానికి జపాను కొద్దికొద్దిగా దొంగతనంగా పంపుచున్నది. మర్తాబనుకి ఎగువగా సముద్రతీరమునుండికూడ కొన్ని సేనలను తెచ్చి మన సేనను కుడివైపునగూడ ఎదిరించుటకు ప్రయత్నించవచ్చును. పడమట మలయాలోగూడ యీ రీతిగానే జపాను సేనలు రెండు వైపులనుండి వచ్చినవి. కావున ఆ విషయం బర్మా సేనానాయకులకు తెలియకపోదు. వారు తగిన సత్కారము చేయుదురు. ఇపుడు తాటనుకి దక్షిణంగాను పాన్‌కు పడమరగాను యుద్ధం కొనసాగుచున్నది. జపానువారు ఏ ఒక్క మార్గం సరిగా అనుసరించలేదు. మన సేనలు తాటాను ప్రాంతములందు క్వీగను వంతెనవద్దనుండి విరమించబడినవి. బిలిను నదీప్రాంతములందు యింకా యోగ్యమయిన తావులందుంచబడినవి. బిలిను నది దొంతామినదికి పడమరగానుండి ఉత్తర దక్షిణములుగా ప్రవహించుచున్నది. దీని ఒడ్డుకి సైన్యాన్ని మార్చుటను శత్రువు నిరోధించలేదు. ఇపుడు మన సేనల కుడిభాగము మోల్మేనుకి ఉత్తరమున 40 మైళ్లదూరంలో నుంచబడినవి. ఇచటనే బిలిను నది మర్తబను సముద్రంలో కలియుచున్నది.

బర్మా యుద్ధమునందు నూతనరంగం ప్రారంభమగుచున్నది. బ్రిటిషు సేనలు బిలిను నదివద్దకు రప్పించబడినందున, శత్రుస్థానములు రంగూనుకు నేలమార్గమున 105 మైళ్లలోను, విమాన మార్గమున 80 మైళ్ల దూరంలోనున్నవి. బిలిను నగరం పెగు పుణ్యస్థలమునకు 55 మైళ్ల దూరంలో నుంది. పెగు నగరం రంగూనునుండి మాండలేపోవు రోడు రైలు మార్గములకు ముఖ్యకూడలి స్థలం.

ఆరు రోజులలో జపానీయులు 60 మైళ్లు ముందుకు రాగల్గిరి. బ్రిటిషువారు వెనుతగ్గుట చాల ఆశాభంగముగను కష్టదాయకంగా నున్నప్పటికి, మన సేనలన్నీ వీలయినంతవరకు ఒక్క దగ్గరే ఉంచాలను ఉద్దేశంతో చేయబడినది. చిన్న చిన్న భాగాలను అక్కడక్కడ యుంచితే అధిక సంఖ్యగ శత్రువులువచ్చి పట్టుకుందురు. అంతేకాక సితాంగునది యింకో ప్రకృతిసహజమగు నిరోధంగా శత్రువుకి ఉండగలదు. బిలినునది దాటినాక శత్రువు దీనిని దాటవలసియుండును కాని సితాంగునుండి పెగువరకు దేశంఅంతా ఎండిపోయిన ధాన్యపు పొలాలు కలిగియుండును. వాటిపై యంత్రపు సేనలు సులభంగా పోగలవు, మార్గం మరుగుగానుండక అందరికి తెలిసిపోవును.

రంగూనులో మలయాలోకన్న మంచిరకం విమానాలున్నాయన్న వార్త ధైర్యం కలిగించగలదు. చీనా సేనలలో చాల అనుభవంగల ఓర్పుగల సైనికులు పెక్కుమంది అనుదినం బర్మా చేరుచున్నారు. ఇండో-చీనారేవులో జపాను 30,000 సైన్యాన్ని దింపి బర్మాలో యుద్ధం చేస్తున్న తన సేనకు సహాయ మొసంగదలచినదని చెపుతున్నారు. దానికి తగినట్లుగా యునాను రాష్ట్రంలో చీనాసేన విశేషంగా సిద్ధంచేయబడియున్నది. అది ఇండో-చీనావైపు దాడి వెడలగలదు. చీనా సేన తాయిలాండుపై దాడి అపుడే యీ వారం ప్రారంభించింది.

---

## సింగపూరు పోవడంగూర్చి ప్రధాని చర్చిల్ ప్రకటన.

## "గుండె నిబ్బరంతో ప్రమాదాలను ఎదుర్కొనగలమనుటకు యిదియొక నిదర్శనం"

సింగపూరు నగరం ఆదివారం రాత్రి శత్రువుల వశమయింది. ఆ విషయమును బ్రిటిషు ప్రధాన మంత్రి మున్ముందు తానే ప్రపంచానికంతకు రేడియోద్వారా ప్రకటించుచు, అది బ్రిటిషు సామ్రాజ్యానికి ఒక ఓటమిగానే అంగీకరించుచు, పరాజయములను గుండె నిబ్బరంతో ఎదుర్కొగలమని ప్రపంచానికి వెల్లడించుటానికి యిదొక అవకాశమని చెప్పిరి.

వారి ఉపన్యాసమునందు యింకను యిట్లు తెలిపిరి. "సైనికరీత్యా పెద్ద ఓటమి జరిగిన వెంటనే నేను మిత్రవర్గదేశములందున్నవారికి ఉపన్యశించుచున్నాను. అది బ్రిటిషువారికే కాక, సామ్రాజ్యమంతకు ఒక ఓటమే. సింగపూరు పడిపోయింది. మలయా ద్వీపకల్పమంతా శత్రువశమయింది. ఆ ప్రాంతములందు యింకా ఎన్నో ప్రమాదాలు ఎదుర్కొంటున్నాయి. స్వదేశం చేరువగా నున్న ఉపద్రవాలేమితగ్గలేదు. కావున బ్రిటిషు జాతి తన సత్తాంతయు తెలివితేటలన్నీ చూపగల సమయం వచ్చింది. దురదృష్టాలనుండి తప్పించుకొని జయం చేకూర్చుకొనే శక్తి చూపగల సమయం ఆసన్నమయింది. కొంతకాలం క్రిందటనే మృత్యుముఖంనుండి తప్పించుకునే శక్తి చూపగలిగితిమి. తిరిగి అట్టి శక్తి కనుపరుచవలసిన అవసరంవచ్చింది. మనము ఓటములను ధైర్యంతో ఎదుర్కొగలమని యిదివరకెన్నోసారులు రుజువు చేసినట్లే యింకోసారి రుజువు చేయుటకు యిది యింకో అవకాశము. ఇకముందు మనం ఒంటరిగాలేమని జ్ఞప్తియందుంచుకోవలెను. గొప్ప మిత్రులు మనకున్నారు. మానవజాతిలో శ్రీవంతు మనపక్షం వున్నారు. మనచర్యపై మానవకోటి భవిష్యత్తంతా ఆధారపడియున్నది. ఇంతవరకు మనం విఫలులము కాలేదు. ఇకముందు కాము. ధైర్యంతో పట్టుదలతో తుపానును ఎదుర్కొందుము గాక."

## గత ఆరు నెలలలో.

"చర్చిల్‌గారు గత ఆగస్టు మాసమునందు యీ రీతిగా రేడియో ఉపన్యాసము ఒసంగియుండిరి. అప్పటినుండి యిప్పటికి జరిగినదంతయు వివరంగా తెల్పుచు, యీ లోగా తాము అమెరికా అధ్యక్షులు రూజువెల్టుగారిని రెండుసారులు చూచియుంటిమనిరి. ఆ నెలలోనే రూజువెల్టుగారు తాను అట్లాంటికు ఛార్టరును ప్రకటించియుండిరనియు, అప్పుడు జర్మనులు రష్యను సేనలను చిదకగొట్టి, మాస్కో, లెనిన్‌గ్రాడు, రాస్టోవుల వైపు విజృంభించుచుండిరనియు తెలిపిరి. రష్యనులు శీతకాలం వరకు నిలబడగలరని అధ్యక్ష రూజువెల్టుగారన్నారు. కాని అన్ని దేశాల సైనిక నిపుణులు అది జరుగునాయని సందేహపడిరి.

అప్పుడు బ్రిటిషుస్థితి కూడ చాలకష్టముగనుండెను. ఒక ఏడాది నుండి జర్మనులతో ఇంగ్లీషువారు ఒంటరిగ పోరాడుచుండిరి. ఇంగ్లాండు పై దాడికి సర్వదా సిద్ధంగానుంటూవచ్చిరి. ఈజిప్టు, నైలు, సూయజు కాల్వలను రక్షింపవలసియుండెను. జర్మను సబుమెరైనులను, విమానాలను తప్పించుకొంటూ అట్లాంటికుద్వారా ఆహార పదార్థములు తెప్పించుకొనుచుండవలసివచ్చెను. ఇప్పటికిని ఈ పన్నులన్ని అట్లే జరుగుచున్నవి.

జర్మనీ దాడి నెదిరించుటకు రష్యాకు శక్తివంచనలేక సహాయం చేయుట బ్రిటిషువారి విధిగానుండెను. అందరి శత్రువగు హిట్లరిని కొట్టుటకు రష్యా చేసిన కృషి అంతా చూస్తే, ఇంగ్లాండు రష్యాకు చేసిన సహాయం ఎంతగనుక. అపుడు, జపానుతో క్రొత్త యుద్ధంలో దిగుటకు బ్రిటిషు వారికి సత్తువలేకుండెను. అట్టి సమయమున చర్చిలుగారు తాను రూజువెల్టుగారిని సందర్శింపబోతిననిరి. అయితే 1940 వ సం॥ ఆగస్టులో ఫ్రాంసు పడిపోయినప్పటి స్థితికన్న 1941 వ సం॥ ఆగస్టులోని ఇంగ్లాండుస్థితి నయంగానేయుండెననిరి.

## ఇప్పటిస్థితి.

అప్పటిస్థితికి యిప్పటిస్థితికి తేడా ఏమిటి? బ్రిటిషు సామ్రాజ్యంస్థితి ఎట్లున్నది. లేస్తున్నామా పడుతున్నామా? స్వాతంత్ర్యం, నాగరికతా ధర్మాల కొరకు పోరాడుచున్నాముకదా, అవి నిలచియున్నవా, అణగిపోవుచున్నవా? అని యిపుడు మంచి చెడ్డలాలోచించుకోవాలి. అప్పటికి ఇప్పటికి గొప్ప వ్యత్యాసం ఏమిటంటే, అమెరికా మనపక్షంవుంది. తిరిగి నేను రూజువెల్టుగారిని చూడబోయినపుడు, మిత్రునివలె మాత్రమేగాక, ఏక ప్రయోజనం సాధింప చేతులుకలిపి పోరాడుచున్న సమానయోధులవలె కలిసికొంటిమి. అమెరికా సంయుక్త రాష్ట్రముల మహాశక్తితో బ్రిటిషు శక్తిని కలిపి, ఎన్నాళ్లయినా సరే విజయం చేకూరేవరకు యీ రెండు శక్తులు కలసి పోరాడ స్థిర సంకల్పంచేసుకున్నపుడు, వాటితో సరితూగగల శక్తి వేరొకటి యీ ప్రపంచంలో ఉందనుకొన వీలులేదు. నేను అట్టి స్థితికొరకే కలలుగనుచుంటిని, యిపుడది సిద్ధించినది.

## రష్యా సేనలు హిట్లరునణగ ద్రొక్కుట.

అంతకంటే ప్రత్యక్షఫలితంగల రెండో గొప్ప సంగతి ఏమనగా హిట్లరు సేనలపై రష్యనుల విజయం. ఇన్నాళ్లు రష్యనులు ధైర్యంతో రక్షించుచుండిన తమ దేశాన్నుండి శత్రువును తరిమివేస్తున్నారు. హిట్లరు అజేయుడన్న ప్రతీతి పోగొట్టేరు. హిట్లరుకి రష్యాలో విజయంగాక విపత్తు మూడింది. ఈ రెండు సంగతులవలన ప్రపంచ పరిస్థితులు మారగలవు. ఇంతకుముందు సాధ్యంకాని విధంగా యికముందు విజయం సాధ్యమవుతుంది.

## నష్టాలు.

ఈ లాభాలకు తోడుగ నష్టంగూడా వుంది. జపాను యుద్ధంలోకి దుమికి పశిఫికు ప్రాంతములందలి సుందర భూములను నాశనం చేస్తున్నది. జర్మనీ ఇటలీలతో పోరాడుచూ, ఉత్తర, మధ్యధరా, అట్లాంటికు సముద్రాలలో యుద్ధంచేస్తూ, బ్రిటను ఒంటరిగా పశిఫికు ప్రాంతాలందు జపాన్ను ఎదిరించగల స్థితిలో ఎప్పుడు యుండలేదు. ఏదో విధంగా పూర్తిగ మిలిగిపోకుండా తలపైకెత్తియాడుచుండినది. బ్రిటిషు సైనికదళాలు, ఆయుధాలు ఊరకయుండలేదు. లిబియాలో పోరాడుచున్నవి. అబిసీనియా, ఇరిట్రియా, పాలస్తీనా, సిరియా, ఇరాకు, పెర్షియా భద్రతకు ఏర్పాటు చేయవలసియుండెను. రష్యాకు గట్టి సహాయం చేయవలసియుండెను. అతివిషమకాలంలోగూడ రష్యాకు గట్టి సహాయం చేయవలసియుండెను. రష్యాకు సహాయం చేసితిమి. ఇన్ని ప్రాంతాలను రక్షించుకుంటూ కదల వీలులేని స్థితిలోనున్నపుడు జపానుని ఎట్లు ఎదుర్కొగలమాయని యోచించుకొనుచుంటిమి. ఒక్కటే ఆశగలదు. జపాను అక్ష రాజ్యాలతో కలసి యుద్ధంలో దిగితే అమెరికా మన పక్షంచేరి, సమాన ఉజ్జీగా నుండునని ఆశించితిమి. అందువల్ల ముందు జపాను ఎంత ప్రమాదకరములైన దురాక్రమణలు జరిపినా జపానుకు కోపం తెప్పించకూడదని అనేక నెలలు ఊరుకుంటిమి. ఇపుడు జపాను దొంగదెబ్బ కొట్టింది. దానినిమించిన దేశం మరొకటి (అమెరికా) మన చెంతనిలచింది. జపాను సులభంగా బ్రిటన్ను ఎదుర్కొనగల్గినపుడు, డంకిర్కునుండి విరమించి ఒంటరిగా ఉన్నపుడు బ్రిటన్ను కొట్టవలసింది. అపుడు కొట్టక యిపుడు యీ పని చేయుట, జపానుయొక్క పిచ్చిదౌర్జన్యమని భావి చరిత్రలో వ్రాయబడగలదు.

"నేడు జపాను విజయోత్సాహంలోనుంది. మనకో నష్టంకల్గి చేరబడితిమి. రాయబారాలు జరుపుతునే, అకస్మాత్తుగా మోసంచేసి జపాను యుద్ధ చర్యకు దిగుటవలన, మన నౌకాదళ రక్షణం కూలింది. 180 లక్షల యుద్ధ ప్రియులుగల జాతి, 20 సంవత్సరాలనుండి యుద్ధానికి తయారవుతున్న జాతియొక్క అత్యాచారాలకు గురియైతిమి. ఈ యిరువదేండ్లలో ప్రపంచానికి ఆయుధవిసర్జనమార్గం చూపించుటకు మనం మన మిత్రదేశాలును నౌకాదళం శక్తి తగ్గించుకొనుచుంటిమి. నదికి అడ్డంగా కట్టబడిన డాము బ్రద్దలుకొట్టి దిగువలోయలోనికి అకస్మాతుగ వరదను వదలినట్లయింది. అందువల్ల నష్టం కలుగక తప్పదు. జపానువారి యుద్ధశక్తిని ప్రమాదమును యెవ్వరు తక్కువగ చూడజాలరు. నేలనుగాని, సముద్రంలోగాని, విమానశక్తిలోగాని వారు కఠినులని రాక్షసులవలె ప్రవర్తింపగలరని రుజువుచేసుకొనిరి. కనుక జర్మనీ మన పీకపట్టుకొనుచున్నపుడు ఇటలీ ప్రక్కలో పొడుస్తున్నపుడు యీ జపాన్ను యెదుర్కోడానికి అవకాశమే లేకుండెననుట నిజం.

"ఇటువంటి జపాన్ను ఆయుధ సహాయం అట్టే లేకుండానే వేలకొలది సంవత్సరాలనుండి యుద్ధప్రతికూల వేదాంతంలో పడియున్న చీనావారు 4½ సంవత్సరాలనుండి యెదుర్కొంటున్నారంటే, వారి శక్తిసామర్థ్యాలు యెంతటివో అని ఆశ్చర్యం కలుగక మానదు. క్రొత్త శత్రువుయొక్క శక్తి తక్కువనజాలము. కాని యీ స్వాతంత్ర్య యుద్ధమున క్రొత్త మిత్రదేశముయొక్క మానుషశక్తి సంపదను గూడ అంచనా వేయజాలము. ఆ దేశము (అమెరికా) పూర్తిగ సిద్ధపడినచో యీనష్టాలన్ని పూడ్చి శత్రువుకి బుద్ధి చెప్పి శాశ్వతమగు సర్దుబాటు చేయగలదు.

## కష్టపడాలి, ఐకమత్యం వుండాలి.

"కొన్ని నెలలవరకు యుద్ధం యిలాగు కఠినంగానేయుండును. మున్ముందు యింకా ఎక్కువ కష్టాలు నష్టాలు రావచ్చును. మన ధైర్యం స్థిర సంకల్పం పోగొట్టుకోరాదు. అదియే మనకు రక్ష. ధైర్యం సడలినచో ప్రాణోపద్రవంకలుగును. ప్రాణపాతకమైన దెబ్బలు తిన్న రష్యా, కోల్కొని దేశయిక్యతను కాపాడుకొని తిరిగి అద్భుతంగా విజృంభించింది. అందుకు భగవంతునకు మనం వందనములర్పిస్తున్నాం. ఇంగ్లాండుకూడా అట్లే చేయగలదు." అని చర్చిలుగారు తెలిపిరి.

---

# భారత సైన్యంలో మూడోవంతే విదేశాలకు పోయింది.

### నవంబరులో 60,000 మంది క్రొత్త సైనికులు చేర్చుకొనబడిరి.

భారత సైన్యంలో అదివరకు సగటున నెలకు 50,000 మందే క్రొత్తవారు చేర్చుకొనబడుచుండిరి. ఈ సంఖ్య గత నవంబరు మాసంలో 60,000 వరకూ పెరిగింది. భారతదేశ సైన్యంలో శిక్షణపొంది ఆయుధాలు చేబూనినవారు 10 లక్షలలోను అత్యధికసంఖ్య ఇండియాలోనే యుంచబడిరనియు మూడోవంతే విదేశాలకు పోయిరనియు తెలుపబడెను.

భారత వైమానికదళంకూడ త్వరగా పెరుగుచు, దేశరక్షణ బాధ్యత ఎక్కువగ వహిస్తున్నది. ఈ దళంలో నొక భాగం యిపుడు బర్మాలో జపానుదాడిని నిరోధించుటకు తోడ్పడుచున్నది.

భారతీయ ఫిరంగి సైనికదళము యుద్ధం ప్రారంభమయినప్పటికన్న యిప్పుడు నూటికి 250 వంతున పెరిగింది.

సైన్యంలో యింత ఎక్కువగ క్రొత్తవారు చేరుచుండుటచేత వారికి తగినంతగ వేలకొలది ఉద్యోగులు కావాలి. ఈ ఉద్యోగులను సైనికులను గూడ తరిఫీదు చేయడానికి శిక్షణ పాఠశాలలు ఎక్కువ చేయబడినవి. మావు, బెంగుళూరు రెండు చోట్లనున్న ఆఫీసరు ట్రెయినింగు పాఠశాలలందు యిపుడు సాలీనా 26,000 మందికి పైగా తరిఫీదు చేయబడుచున్నారు. ఇతర తరగతుల సైనికులందరికి వేరువేరు శిక్షణాలయములు పెద్దవి చేయబడినవి.

## వైమానిక దళం.

భారతీయ వైమానిక దళంలో యిపుడు నూరు మందికి పైగా పైలట్లు, అబ్జర్వరులు తరిఫీదుచేయబడిరి. వీరుగాక యింకా 800 మంది వేరు వేరు తరగతులవారు శిక్షణయందున్నారు. అంబాలా వైమానిక పాఠశాలనుండి జనవరి ఆఖరు సరికి 33 వైమానికులు అబ్జర్వరులు (విమానంలో నుండి పరిశీలించువారు) తయారయ్యిరి వీరంతా క్రొత్త స్క్వాడ్రను దళముగ నేర్పడెదరు.

సముద్రతీర రక్షణ దళమునందు యిపుడు నూటికి 75 మంది చొప్పున భారతీయులేగలరు.

యుద్ధానికి పూర్వం భారతీయ ఫిరంగి దళమునందు కొండలవద్దనుండే కొద్ది ఫిరంగులుండేవి. ఇపుడా దళములకు అన్నిరకముల ఆయుధాలు, బరువైన ఫిరంగులు, తేలిక ఫిరంగులు, టాంకువిధ్వంసక దళములు, విమాన విధ్వంసక ఫిరంగిజట్లు చాల యున్నవి. అదివరకున్న భారతీయ కాల్బలం రెజిమెంట్లు యిపుడు ఆర్టిలరీ (ఫిరంగిదళం) రెజిమెంటులుగ మార్చబడినవి. వారిలో పెక్కుమంది యిపుడు విమాన విధ్వంసక ఫిరంగులు, టాంకులను కొట్టే ఫిరంగులను ఉపయోగించువారుగాను తరిఫీదు చేయబడిరి.

భారతీయ సైన్యంలో యిపుడు అన్ని ప్రాంతములనుండి వచ్చినవారుగలరు, ముఖ్యంగా పంజాబీలు, శిక్కులు, రాజపుత్రులు, జాట్సు, మహారాష్ట్రులు.

# మహాసమర మథనము.

పూర్వము దేవతలూ, రాక్షసులూ కలిసి అమృతముకొరకు క్షీరసముద్రమును మథనంచేశారు. మహాపర్వతమునే కవ్వంగా ఏర్పాటుచేసి సముద్రాన్ని చిలికినారు. ఇటు దేవతలూ, అటు రాక్షసులూ రెండు పార్టీలుగా ఏర్పడి చిలికినపిమ్మట ఏమి జరిగినదయ్యా అంటే, అమృతం లభించలేదు సరిగదా, హాలాహలం అనే ఘోరమైన విషము ఆ సముద్ర గర్భంలోనుంచి ఉద్భవించింది.— ఆ విషము భుగభుగమని పైకివచ్చే సరికి ఎక్కడివాళ్లు అక్కడ "ఏమిటిరాగతి?" అనే ఆలోచనలోను విచారంలోను పడ్డారు. కాని, సముద్ర మథనం మాత్రం రాక్షసులూ ఆపలేదు, దేవతలూ ఆపలేదు. భగవంతుణ్ణి ప్రార్థన చేస్తూ మథనం ఇంకా సాగిస్తూనేఉన్నారు. అప్పుడు శివుడు ఆ విషమును యావత్తూ తానే మ్రింగివేసి, తానే దానినంతా భరించి, "భయంలేదు. ఇంకా మథించండి!" అన్నాడు. చిట్టచివరకు అట్లాగే మథించగా, మథించగా, అమృతం లభించింది. అమృతం లభించక పూర్వమున్నూ, విషంపుట్టక పూర్వమున్నూ, ఆ సముద్ర గర్భంలోనుండియే, అనేక రత్నాలుకూడా ఉద్భవించాయి. ఆ రత్నాలుచూచి ఆనందించి అంతటితో ఉబ్బితబ్బిబ్బై ఆసలు యీ మథనం దేనికొరకై చేస్తున్నారో ఆ ప్రయోజనమే పూర్తిగామరచిపోయి, ఆ రత్నాలు చేతబట్టుకొని, అంతటితో సముద్రమథనం చాలించలేదు. ఈ మహా పురాణగాథలో చాలా అంతరార్థం ఉంది. ఈ విషయమునే పూర్వమొక గొప్ప కవీశ్వరుడు చక్కని చిన్న పద్యంగా వ్రాశాడు.

> "తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత?
> వెరచిరే ఘోర కాకోలవిషముచేత?
> విడచిరే యత్నమమృతంబు వొడము దనుక?
> నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు"

ఈ పద్యానికి అర్థం పైన చెప్పిన పురాణగాథలోనేఉంది. ఏమని అంటే,—

వేల్పులు అనగా దేవతలు రత్నములచేత సంతృప్తి జెందినారా? లేదు ఆ దేవతలే, కాకోలము అనబడే ఘోరమైన విషమువల్ల భయపడినారా? లేదు. అమృతము లభించేటంతవరకూ తమ ప్రయత్నం విడిచిపెట్టినారా? విడువలేదు. కనుక కార్య సమర్థులైనవారు తమ సంకల్పమును ఏ కారణాలచేతనూ మధ్యలో విడిచిపెట్టరు.

ఈ మహా ప్రపంచసమరంకూడా సముద్ర మథనం మాదిరిగానే జరుగుతోంది. నిజంగా అక్షరాలా, ఈ మహాయుద్ధం సముద్ర మథనమేఅని చెప్పవచ్చు. ఎందుచేతననగా, బ్రిటిషువారికి సముద్రము మీద ఉన్నటువంటి అపారమైన బలాన్ని శోధించి శోధించి, ఆ సముద్ర మార్గాధిపత్యానికి ఆధారభూతములైన వాని నన్నింటిని మథించి ఆ సముద్రాధి పత్యంలోఉన్న నిజమైన సారమేమిటో, నిజమైన బలమేమిటో పరీక్షించడానికి మన శత్రు రాజ్యాలైన జపాను, జర్మనీ, ఇటలీ పూనుకొన్నవి. ప్రపంచం అంతటిలోను ఏ రాజ్యానికీ లేనటువంటి బ్రహ్మాండమైన నౌకాబలం బ్రిటిషువారికిఉంది. ప్రపంచ మంతట తిరిగి రావాలని సంకల్పించి మనము సముద్ర ప్రయాణంచేస్తే బ్రిటిషువారికి సముద్ర మార్గాలన్నియు హస్తగతమై ఉన్నవని బోధపడుతుంది. ఈ సముద్ర మార్గములయొక్క ప్రధాన సింహద్వారములన్నీ బ్రిటిషువారి చేతులలో ఉన్నాయి. సింగపూరు, సూయజుకాల్వ, జిబ్రాల్టరు యివి బ్రిటిషువారి ఆధిపత్యంలో ఉన్నటువంటివే. ఈ సముద్రపుగేట్లను బ్రిటిషువారు మూసివేసితే, ఏ రాజ్యాల నావలున్నూ అంతర్జాతీయ రవాణా వ్యాపారాలు సముద్రాలు దాటి చెయ్యలేవు. ఈ సముద్ర మధ్యమార్గంలో ఎక్కడెక్కడ స్టీమరులు ఆగి బొగ్గును ఎక్కించుకోవలసిన అగత్యం ఉంటుందో, ఆ మధ్య మకాములన్నీ బ్రిటిషువారివే. భూప్రదక్షిణం చేస్తూ, ఎన్ని సముద్రాలు మీదుగా ప్రయాణంచేసినా, ఎక్కడికిపోయినా బ్రిటిషువారి రాజ్యాలు, బ్రిటిషువారి లంకలూ, కన్పిస్తూనేఉంటాయి. ఈ విధంగా అనేక సముద్రాల మీద తిరుగుతూ ఉండేటందుకు బ్రిటిషువారు నిర్మించినన్ని రహదారీ నావలను ఇంకెవ్వరూ యీ ప్రపంచంలో నిర్మించలేదు. అనేక లక్షల టన్నుల పెరశిప్రమాణంగల నౌకాదళం వారికిఉంది. ఈ సముద్ర మార్గాలను రక్షించడానికి కావలసిన బ్రహ్మాండమైన యుద్ధనావలు బ్రిటిషువారికి ఉన్నాయి. వారికి ఉండినన్ని యుద్ధ నావలు మరెవ్వరికీలేవు అనే అసమాన విఖ్యాతినిగడించారు. ఈ యుద్ధ నావలను నడిపించడంలోను, నౌకా యుద్ధంలోను అద్వితీయమైన ప్రావీణ్యం సంపాదించిన నౌకాదళ సైన్యం బ్రిటిషువారికిఉంది. అనేక కోట్ల ద్రవ్యం వెచ్చించి బ్రహ్మాండమైన యీ నౌకాదళాన్ని బ్రిటిషువారు అనేక శతాబ్దములనుంచీ తయారుచేసారు. అనేకకోట్ల ద్రవ్యం వెచ్చించి తమ వశమందున్న సముద్ర మార్గాలవద్దను, మధ్య మకాములవద్దను కావలసిన బందోబస్తులన్నీ నిర్మించి ఏర్పాటుచేసారు. ఈ కారణాలవల్ల బ్రిటిషువారికి సర్వ సముద్రాధిపత్యం లభించింది. కొన్ని వందల సంవత్సరాలనుంచీ సంపాదించిన సముద్రాధిపత్యం ఇది. ప్రపంచంలోని అన్ని రాజ్యాలవారికే అంతర్జాతీయ రవాణా వ్యాపారాలు నిరాఘాటంగా సాగుతూ ఉండడానికి వారి సముద్రాధిపత్యమే అందిరికీ ఆశ్రయంగా, అండగాఉన్నది. లోకమంతటా ఊడలుదిగి విస్తరించిన బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టును ఆశ్రయించుకొని అనేక పక్షుల కుటుంబములు సుఖంగా జీవిస్తూ, సునాయాసంగా వ్యాపార వ్యవహారాలు చేసుకోగల్గుతున్నాయి ఈ సర్వసముద్రాధిపత్యకార్యభారము తాము వహిస్తామని బ్రిటిషువారు సమర్థులై నిలువబడినారు. సర్వ సముద్రమార్గ రక్షణ మేముచేస్తామని నడుముకట్టుకొని, ముందుకువచ్చి నిలువబడగల్గిన రాజ్యం ఇంకొకటిలేదు. తమ సముద్రాధిపత్యాన్ని దుర్వినియోగం చెయ్యకుండా సర్వలోక క్షేమలాభైశ్వర్యాభి వృద్ధికొరకై నిర్వహించి, తమ సముద్రాధికారాన్ని సద్వినియోగం చేస్తున్నారు. అటువంటి సముద్రాధిపత్యమును ఇంకొకరు కోరివరించినా, భరించలేరు. ఈ ఆధిపత్యమును ఎవరో ఒకరుమాత్రమే భరించడం క్షేమకరం. జగదేక రక్షకుడుగా ఎవరైనా ఒకడు ఉండవలెనంటారా? అక్కరలేదంటారా? మనపురాణ ప్రమాణాలు చూచినప్పటికీ, జగద్రక్షకుడైన శ్రీమహావిష్ణువు ఎక్కడ ఉన్నాడయ్యా అంటే, సముద్రంమీద స్థిరమైన మకాము ఏర్పాటుచేసికొని, వేయి పడగలుగల ఆదిశేషువుమీద పవళించి లోకమును తాను కనిపెట్టి రక్షిస్తున్నాడు. సర్వ సముద్రాధిపతిగా ఉండి లక్ష్మినిచేపట్టినవాడే, అనేకవేల పడగలతో విస్తరించిన తన నౌకాదళంమీద ఆధారపడి, లోకానికి ధర్మకర్తగాఉండి ధర్మరక్షణ చెయ్యగలడు.

అటువంటి విష్ణ్వంశగల బ్రిటిషు సార్వభౌముని యొక్క సముద్రాధిపత్యం ఎందుకు ఉండాలి? అనే ధిక్కారాహంకార పూరితుడైన హిట్లరు ప్రారంభించాడు. బ్రిటిషువారి సముద్రాధిపత్యమును సర్వ నాశనం చెయ్యాలని సంకల్పించుకొన్నాడు. జర్మనీ, ఇటలీ, జపాను అనే అక్షరాజ్యాలు ఒక కూటంగా, ఒక పార్టీగా యిందుకోసం ఏర్పడినాయి. ఈ అక్షరాజ్యాలు రాక్షస రాజ్యాలుగా తయారైనాయి. జర్మనీవాళ్లు యుద్ధం ప్రకటించిన మొట్టమొదటినాడే, ఒక పెద్ద ప్రయాణీకులనావను నడి సముద్రంలో ముంచివేశారు. ఆనావనిండా, ఆడవాళ్లు పిల్లలు, నిరాయుధులైన నిరపరాధులైన వాళ్లు వందలుకొలదిగా ఉన్నారు. అది యుద్ధనావకాదు. కేవలం గుడ్లుపెట్టిన పక్షుల గూడువంటి ప్రయాణీకుల నావ. అటువంటి నావను ముంచినవాడు క్రూరకిరాతు డంటారా లేదా? యుద్ధ కథారంభంలోనే, మొట్టమొద

# ఎడారి ఇసుకలో బ్రిటిషు టాంకు.



అతివడిగా పోగల బ్రిటిషు టాంకు యుద్ధ మోటారులు ఎన్నో ఎక్కువగా లిబియాకు పంపబడినవి. అందొకటి యిసుక నేలమీద అతివడిగా పోవుచున్నది. ఆ వడికే యిసుక ఎగిరి దానిని కప్పివేయుచున్నది.

---

ంగా జర్మను జలాంతర్గామిచేసిన ఘోర రాక్షస కృత్యం ఇది. ఆ రోజు మొదలుకొని, యీ రోజు వరకు ఈ అక్షరాజ్యాలనబడే రాక్షస రాజ్యాలు చేస్తున్నపని ఇదే ఈ రాక్షస రాజ్యాలు యీ వెర్రి వీరావేశంలో తమ ఒళ్లు తామే తెలియకుండా ప్రవర్తిస్తున్నాయి. మొన్న నీ మధ్య ఒక శత్రు జలాంతర్గామి అట్లాంటిక్కు సముద్రం లో వీరవిహారముచేస్తూ తమ నావనే ముంచి వేసింది.

జనవరి 31 వ తేదిని అట్లాంటికు మహాసముద్రంలో స్పెయిను దేశానికి పడమరగా ఉన్న అజోర్సు ద్వీపమునకు ఉత్తరంగా 450 మైళ్ల దూరంలో "బ్రిటనీ" అనే పేరుగల బ్రిటిష్ నావయొకటి మునిగిపోవుచున్నట్లుగా, ఒక రేడియో వార్త ఆ మునిగిపోవుచున్న నావమీదనుండి పంపబడినట్లుగా ఇంగ్లాండులోని బ్రిటిష్ నౌకాధికారులకు వచ్చింది. "తాను ఫలానా ప్రదేశంలో మునిగిపోవుచున్నాననియు, తనకు సహాయం కావలెననియు ఆ రేడియో వార్తలో కలదు. కాని ఆవార్తను బ్రిటిష్‌వారు నమ్మలేదు. తిరిగి ఆ ప్రదేశంనుండియే మరొక రేడియో వార్త ఇంగ్లీషు భాషలోను, జర్మను భాషలోను కొంతసేపటికి వచ్చింది. "స్పినాల్డు" అనేనావ మునిగిపోవుచున్నట్లుగా ఈ వార్తలో తెలియజేయబడింది. స్పినాల్డు అనేది జర్మనునావ. ఈ నావ 1941 వ సం॥ ఆగస్టు మాసంలో జపానులోని యోకహామా రేవులో చిక్కుపడియుండెను. యుద్ధం జరుగుతున్న సమయంలో తిరిగి జర్మనీకి మరలి రాలేకపోయింది. కాని ఎట్లాగో సాహసంచేసి జపానునుంచి బయలుదేరింది. పసిఫిక్కు సముద్రంలోనుంచి అట్లాంటిక్కు సముద్రంలోకి వచ్చింది. ఐరోపా ఖండానికి సమీపించింది. జర్మనీకి చేరవలెనని వస్తోంది. అటువంటి సందర్భంలో ఒక శత్రు జలాంతర్గామి దానిని త్రోవలో అడ్డగించి దానిమీద టార్పెడో ప్రయోగించి ముంచివేసింది. బ్రిటిష్ నౌకాధికారులకు రేడియో వార్త ఆ నావమీదనుండి వచ్చినతోడనే, బ్రిటిష్ విమానము, బ్రిటిష్‌నావయొకటి, ఆ రేడియో వార్తలో గుర్తుగా చెప్పబడిన సముద్ర ప్రాంతానికి, వెళ్లి చూచింది. అప్పటికే "స్పినాల్డు" అనబడే ఆ జర్మను నావ తగులబడి మునిగిపోవుచున్నది. చుట్టు ప్రదేశమును వెదకిచూడగా, మూడుమైళ్ల పొడుగున నీళ్లమీద నూనె తేలుచుండెను. స్పినాల్డు అప్పటికే మునిగింది. ఈ నావను ముంచిన శత్రుజలాంతర్గామి ఇటలీదో జర్మనిదో తెలియలేదు. ఇంతకూ చెప్పవచ్చిన దేమిటంటే, ఈ అక్షరాజ్యాలవారి రాక్షస కృత్యాలు ఇట్లా ఉన్నాయి. ఒళ్లు మైమరచి వెర్రివీరావేశంలో తిరుగుతూవున్న తమ జలాంతర్గాములు తమ నావలేవో, తమ విరోధులనావలేవో తెలిసికొనలేకుండా, తమ నావనేముంచి వేసుకుంటున్నవి. ఇంటికివచ్చిన తమ యజమానిని చూచి మొఱిగేటటువంటి తెలివిగల పెంపుడుకుక్కలు ఇవి. కొన్ని జర్మనునావలు బ్రిటిష్‌వారికి చేజిక్కకుండా తమంతట తామే ఆత్మవిధ్వంసము చేసికొన్నాయి.

జర్మనుజలాంతర్గాములున్నూ, ఇటలీ జలాంతర్గాములున్నూ, జపాను జలాంతర్గాములున్నూ సముద్రముల నన్నింటిని శోధించి మధించి కవ్వంతో చిలికినట్లుగా సముద్రమథనం చేస్తున్నాయి. బ్రిటిష్ నావలను ముంచివేస్తేనేగాని, బ్రిటిష్ నౌకాబలం క్షీణించదని ఈ రాక్షసరాజ్యాలు నిశ్చయించుకున్నాయి. బ్రిటిష్ నౌకాబలాన్ని ధ్వంసంచేస్తేనేగాని బ్రిటిష్‌వారిసముద్రాధిపత్యంధ్వంసంకాదనిన్నీ, బ్రిటిష్‌వారి సముద్రాధిపత్యం పోతేనేగాని, శాశ్వతమైన లోకశాంతి ప్రతిష్ఠాపన జరుగదనిన్ని హిట్లరు సిద్ధాంతీకరించి, తన జర్మను రేడియోలో ప్రచారం చేస్తున్నాడు. హిట్లరు మాదిరిగానే పూర్వం, హిరణ్యకశిపుడుకూడ లోకానికి బోధించాడు. "వైకుంఠుండు కృతాపరాధి" అన్నాడు. వైకుంఠవాసియైన విష్ణుమూర్తి మహా అపరాధము చేసినవాడు గనుక ఆ విష్ణుమూర్తిని ఆరాధించకుండా, ప్రజలందరూ హిరణ్యకశిపునే భగవంతునిగా ఆరాధించవలసినదని ఆర్డరు వేశాడు. బ్రిటిష్‌వారి సముద్రాధిపత్యం ఎందుకు ధ్వంసం చెయ్యవలెనయ్యా అంటే, "ప్రపంచ శాంతికోసం" అని హిట్లరు జవాబు చెప్పుచున్నాడు.

"ప్రపంచశాంతి" అనేది మానవకోటికి అమృతతుల్యమైన వస్తువు. అది లేకపోతే, అంతులేని ప్రపంచ సంక్షోభం సాగుతూనే ఉంటుంది. స్థిరమైన శాశ్వతమైన శాంతిఅందరికీ కావాలి. అదే మనం సాధించవలసిన అమృతం. "అన్ని రాజ్యాలవారూ ఆయుధాలు, విమానాలు, యుద్ధ నావలు, మితిమీరి నిర్మించకుండా ఉంటే ఒకరివల్ల ఇంకొకరికి యుద్ధభయం ఉండదు. అప్పుడు స్థిరమైన శాంతి లోకానికి లభిస్తుంది. ఆయుధోత్పత్తి నిగ్రహం అందుకు ఆవశ్యకర్తవ్యం. ఇదే లోకశాంతి సాధనోపాయం" అని బ్రిటిషువారు జర్మనీతో చిలుకకు చెప్పినట్లుగా చెప్పారు. ఆ యుధ విసర్జన విషయమై అన్ని రాజ్యాలవారు కలిసి ఆలోచించడానికి అనేక సభలు సమావేశపరిచారు. అసలైన నిసలైన లోకశాంతి ప్రతిష్ఠాపనా పద్ధతి అదే. కాని, హిట్లరుకు యీ మంచి మాటలు చెవికెక్కలేదు. ఒక ప్రక్క ఆయుధనిగ్రహ విషయాలను బ్రిటిష్‌వారు త్రికరణశుద్ధిగా చర్చిస్తూ ఉండగానే, జర్మనీలో హిట్లరు విపరీతంగా విమానాలు, జలాంతర్గాములు యింకా యుద్ధ సాధనాలు నిర్మిస్తూనే ఉన్నాడు. ఆవిధంగా అహోరాత్రాలు తన ఫ్యాక్టరీలలో ఆయుధాలు తయారుచేస్తూ కత్తులునూరుతూ ఉన్నటువంటివాడు, నిజంగా లోకశాంతిని కోరినటువంటివాడేనా ?

ఎట్లయినప్పటికీ, అక్షరాజ్యాలనే టటువంటి రాక్షసకూటం కోరేదికూడా ప్రపంచ శాంతియేగాని మరొకటికాదు. లోకశాంతి కోసమే యుద్ధం చేస్తున్నానని హిట్లరు అంటున్నాడు. దేవతలు కోరినా, రాక్షసులు కోరినా అమృతమేగాని విషంకాదు. లోకశాంతియేగాని, లోకసంక్షోభంకాదు. ఈ అమృతంకోసమే మహా సంగ్రామము జరుగుతోంది. అసురులూ, అమరులూ చేస్తున్న అమరాసురసమరం ఇది. మహాసముద్రమథనం జరుగుతోంది. అటు దేవతలూ, ఇటు దానవులూ చేరితేనేగాని సముద్రమథనంజరగదు. అమెరికావారూ, బ్రిటిషువారూ, రష్యావారూ, చైనావారూ ఒక పక్షంగా చేరివున్నారు. అమెరికావారు అనంతకోటి రూపాయల ద్రవ్యమును ఆయుధ నిర్మాణంకోసం వెచ్చించి అతి వేగంగా అనేక యుద్ధనావలను రహదారీ

నావలను అమెరికాలో నిర్మిస్తున్నారు. అమెరికా వారి ఫ్యాక్టరీలలో అహోరాత్రాలు పనిచేసి విమానాలు తయారు చేస్తున్నారు. మొన్న అమెరికా సంయుక్త రాష్ట్రీకుల శాసన సభలో నౌకాదళ్ణా సాయి సంఘంలో ప్రముఖుడైన మాక్ అనే సభ్యుడు యీ క్రింది విధంగా చెప్పాడు:—

"అమెరికను సైనికులువచ్చి ఆసియా ఖండం లోను, యూరోపు ఖండంలోను ఆఫ్రికా ఖండం లోను యుద్ధం చేయగలరు. వేలకొలది అమెరికను విమానములు జపానుపైనను, జర్మనీపైనను ఆకాశమంతా ఆవరించి విజృంభించును. అమెరికను నౌకాదళము అన్ని సముద్రములలోను శత్రు యుద్ధ నావలను ముంచివేసి విజయము చూరగొనును" అని శపథంచేసి చెప్పాడు. సభలో వున్న అమెరికను ప్రముఖులందరూ "సెబాస్!" అన్నారు—అటువంటి బ్రహ్మాండమైన సంకల్పం కలవారే అమరులు. అమెరికను సంకల్పంలో అమరత్వం, దేవత్వం వున్నది. అమెరికను సంకల్పశక్తి బ్రహ్మాండమైన ఆదిశక్తివంటిది "జర్మనీకి అమెరికాతో యుద్ధం వస్తే అది అసాధ్యమైన యుద్ధంగా ఉంటుంది" అని హిట్లరే యిదివరకు అన్నాడు. అమెరికా ప్రభుత్వం మొన్ననే చైనాకు 50 కోట్ల డాలర్లు అనగా సుమారు 175 కోట్ల రూపాయిలు అప్పు యిచ్చింది. రష్యాకు యిప్పుడు 100 కోట్ల డాలర్లు (అనగా సుమారు 350 కోట్ల రూపాయలు) అప్పు యిచ్చింది. ఈ ద్రవ్యానికి సరిపోయిన ఆయుధాలు రష్యాకు అమెరికా సప్లయి చేస్తానన్నది. ఇంగ్లాండుకు ఎన్నికోట్ల కిమ్మతుగల సరకునైనాసరే సరకు చేయక సప్లయి చేస్తోంది. ఈ అమెరికనులకు వీరావేశం పుట్టింది. అటువంటి వీరావేశం పుట్టినదంటే, అమరులనైనా జయించవచ్చుగాని అమెరికనులను జయించేవాడు జగత్తులో ఉండడు. ఈ రహస్యమే బాగా గ్రహించండి అని బ్రిటిష్ ప్రధానియైన చర్చిలుగారు, సింగపూరు జపానువశమైన నాటి రాత్రి లండను రేడియోలో ఉపన్యసిస్తూ చెప్పాడు.

"ప్రస్తుతం మంచి చెడ్డలు విమర్శించి చూచుకొందాము. ప్రప్రథమంగా చెప్పవలసిన ముఖ్యమైన పెద్దవిషయం ఏమంటే, అమెరికా ప్రభుత్వం హృదయ పూర్వకంగా మనతో ఏకీభవించి, మనకు తోడునీడగా యుద్ధంలోకి యిప్పుడు దిగింది. ఇటీవల నేను అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారితో మాట్లాడినప్పుడు శత్రువును ఎదిరించుట విషయంలో మాకిద్దరికే సమానలక్ష్యం ఏర్పడింది. అమెరికా మనతో చేరింది కాబట్టి అమెరికావారియొక్క విస్తారమైన సాధన సంపత్తియున్నూ, మనకుగల సాధన సంపత్తియున్నూ ఒక్కటిగా చేరినప్పుడు యీ యుద్ధం యెంతకాలం జరిగినాసరే విజయలక్ష్మిని చేబట్టుటకై చావుకుతెగించి నిలువబడగలము. ఈ యుద్ధంలో అమెరికా ఇంగ్లాండుల సాహచర్యమే చాలా గొప్పవిషయం. ఇది ఏరీతిగా సాధ్యమగునా అని నేను కలవరించాను. అందుకొరకై నేను స్థిరలక్ష్యంతో పని చేశాను. ఇప్పటికి నాస్వప్న మనోరథము సిద్ధించింది. ఇక రెండో ముఖ్య విషయమేమనగా, రష్యనులు ఓడిపోలేదు. జర్మను సేనలను తరిమివేయుచున్నారు. రష్యాలో హిట్లరుకు విపత్తు మూడినది. ప్రపంచ మానవకోటిలో మూడొంతు మన పక్షమున చేరి మనతో నడచుచున్నది. మనము గొప్పరాజ్యాల మధ్యనున్నాము. మానవకోటియొక్క భవిష్యత్తు మన చర్యలమీద ఆధారపడివున్నది. నేటిరాత్రి సింగపూరు శత్రువశమైనది. మలయా ద్వీపకల్పమంతా శత్రువశమైనది. అక్కడ యింకా మనకు మహోపద్రవములు రానున్నవి. . . . అందువల్ల మనమందరం ఏకంగా పట్టుదలతో యీ మహాప్రళయ ప్రచండమైన తుపాను నెదిరించి ముందు కర్తవ్యమున కుపక్రమించెదము గాక!" అని చర్చిలుగారు చెప్పిన యీ ఉపన్యాసం మహా సముద్రము హోరుమని ఘోషించినట్లుగా రేడియోద్వారా లోకమంతటా మారుమ్రోగింది. అమెరికనులను యుద్ధరంగములోనికి తీసికొనివచ్చిన చర్చిలుతో చర్చించగలవాడు లేడు. "సింగపూరు ఎందుచేత శత్రువశమైనది? లోపము ఎవరియందున్నది" అని చర్చించుట చర్చిలుగారి పనికాదు. అట్టి చర్చలకిది సమయము కాదని చర్చిలు తిరిగి మొన్న పార్లమెంటు సభలో అన్నారు.

ఇటు అమరులు, అటు అసురులు సముద్రమథనం చేస్తున్నారు. సమరమథనం చేస్తున్నారు. ఇటు అమెరికనులు, అటు అక్షరాజ్యాలవారు యింకా మున్ముందు సమరమథనం చెయ్యాలి. అమరులూ, రాక్షసులూ మథిస్తేనేగాని అమృతం లభించదు. అంత్యవిజయమూ లోకశాంతీ లభించాలంటే ఇంకా మథనం జరుగక తప్పదు. కాని, సద్యః తాత్కాలికంగా సింగపూరు శత్రువశమగుటవల్ల విపత్తు వచ్చింది. అమృతంకోసం మథిస్తే, విషము ఉద్భవించింది. అందుకనే చర్చిలుగారు అన్నారు—"తాత్కాలికంగా మన సముద్రబలమును జపాను కూలద్రోసింది . . . కాని విపత్తు నుండి విజయమును సాధించగల మహా సంకల్పశక్తిని చూపించవలసిన తరుణం ఇదే" అని చర్చిలుగారు నిశ్చల ధైర్యంతో అన్నారు. ఈ అపజయమున కంతటికీ నేనే బాధ్యత వహిస్తాను. అందుకు నన్నే నిందించండి. సైనికాధికారులనుగాని, తదితరులనుగాని నిందించవద్దు. "ఇటువంటి విషాద విషమును భరించగలవాడను నేనే" అని నిలువబడి, లోకము తల్లడిల్లకుండా, యీ తాత్కాలిక విషాదమును ఎంతయినా మ్రింగివేయగల నన్నాడు. ఈ జవాబుదారీ అంతా నేనే భరిస్తానన్నాడు. ఎటువంటి విషమ పరిస్థితులకైనా తలయొగ్గి బాధ్యత వహించి, "శివోహం" అని శిరసావహించాడు. విషమును మింగిన శివుడే త్రిపురాసుర సంహారంచేసిన శివుడు. సంగ్రామ మథనం సాగించుడని చెప్పి రూజువెల్టుగారు కూర్మావతారంలాగున తనమీదనే భారంమోపి, "ఊపండి కవ్వం ఓపికకొలదీ" అని అన్నాడు. అంత్య విజయం మనదే అని చర్చిలు ఎందుకు అంటున్నాడో ఆ అంతరార్థం గ్రహించాలి. అసురుల సంకల్పబలం ఎటువంటిదో అమెరికను సంకల్ప బలం అటువంటిది. సింగపూరుకు లొంగిపోయే పెంగళప్పకాడు చర్చిలు. ఈ బ్రిటిష్ ప్రధాని విషంమింగి విజయం సాధిస్తాడు. ఈ వీరుడు సాగర గంభీరుడు. సముద్రం ఎంతలోతుగా ఉన్నదో, ఆయన సంకల్పం అంతలోతైనది. అందుకనే అంత నిర్భయంగా అభయహస్తమిచ్చాడు. ఇంకాకొన్ని దినాలు ఇట్లాగే విషమకాలంగానే ఉంటుందనికూడా నిర్భయంగా చెప్పాడు. జపానువాడు బర్మాలోకి పరుగెత్తినా, ఇండియామీదకు దండెత్తినా ఏమీ భయంలేదన్నాడు. కిందికోర్టులో ఉరిశిక్ష విధించినా, హైకోర్టులో ముద్దాయిని విడుదల చేయించేభారం నాది అని చెప్పి వాదించి సాధించగల నిపుణుడైన న్యాయవాదిని నమ్మకపోతే నష్టమెవరికి? న్యాయవాదికి కాదు—అక్రమంగా చిక్కులపాలైన ముద్దాయికే ముప్పు—అందుకనే ఈ బ్రిటిష్ ప్రధాని చెప్పినవి బీజాక్షరాలుగా ఆంగ్లేయు లందరూ మననం చేస్తున్నారు. మనంకూడా తరించవలెనంటే, వారిని అనుసరించి శిరసావహించాలి.

సముద్రమథనం అంతా అయినతర్వాత అమరులు పానంచేసేది అమృతం. —రాక్షసులకు దక్కేది శూన్యం —కాని ఉభయులూ కష్టపడితే వచ్చేది అమృతం—రాక్షసత్వం శూన్యమై పోవడమే అమరత్వం—చీకటిపోవడమే వెల్తురు—అజ్ఞానం, అహంకారం పోవడమే ఆత్మజ్ఞానం, ఆత్మస్వాతంత్ర్యం—లోక సంక్షోభబీజములు లేకుండా పోవడమే లోకశాంతి. అదే అంత్యవిజయం. అదే బ్రిటిష్ ప్రధానియైన చర్చిలుగారి మనోనిశ్చయం —అది ముమ్మాటికీ నిశ్చయం—తథాస్తు!

ఓం! శాంతి శ్శాంతి శ్శాంతిః!

## చీనా వింతలు విశేషాలు.

### చాంగ్‌కాయి షేకు సతి తెల్పుట.

చీనా సర్వసేనాధిపతి ప్రభుత్వాధ్యక్షుడునగు మార్షలు చాంగుకాయి షేకుగారు గతవారం ఇండియాకు వచ్చినవిషయం గత సంచికలో చదివియున్నారు. చాంగ్ కాయి షేకు సతి అమెరికాయందు పాశ్చాత్య విద్యనేర్చిన విదుషీమణి. ఆమె తన భర్తకు జాతీయోద్యమమునందెంతో తోడ్పడుచుండును. ఆమె డిల్లీలో భారతమహిళా సభయందు, పత్రికా ప్రతినిధుల సభయందు ముచ్చటించుచు చీనాగురించి తెలిపినకొన్ని ముఖ్య విశేషాలు యీ దిగువకలవు:—

చీనాలో మతసంఘాలు ప్రత్యేకంగా లేవు. జాతీయ జీవనంలో మతం కలసిపోయింది. రాజకీయాలకు మతమనే రంగుపూత లేదు. చైనీయులంతా ఒకటే.

బానిసలుగా బ్రతికియుండి బిడ్డలను, మనములను గూడా బానిసలుగా చేయుటకంటే చచ్చుటే మేలని భావించి, చీనాను శాశ్వతంగా జపాను దురాక్రమణనుండి తప్పించాలనే పట్టుదల చీనావారందరికి యుండబట్టి, యింత బ్రహ్మాండమగు శత్రునిరోధం చైనీయులు చేయకలిగిరి.

విలువగల వస్తువులేవి శత్రువుకి లభించకుండ చేయుటకై ఇండ్లు, పొలాలు, ఆస్తులు అన్నికూడా చైనీయులు తగులబెట్టి పారిపోయిరి. జాతీయ జీవనమును రక్షించుటకు వ్యక్తిజీవితములను త్యాగం చేసే ధైర్యం తెగింపువుండాలని చైనీయులెరుంగుదురు.

యుద్ధం అంటె ఏమిటో గ్రామాలకు పోయి చెప్పడానికి వేలకొలది చీనాస్త్రీలు తరిబీదుచేయబడిరి. దేశానికుపద్రవం వచ్చినపుడు చదువుకుంటూ కూచోలేమని ఎందరో చీనాస్త్రీలు స్కూళ్ళు, కాలేజీలు వదలి యుద్ధంపనులలో సహాయంచేయడానికి వచ్చారు.

పురుషులు షూరంగావుంటారుకదా, అటువంటి పురుషులు సైనికులన్నీ శిబిరాలకు ఆస్పత్రులకు స్త్రీలుపోయి యెలా పనిచేయగలరు? ఆ భయం చైనాస్త్రీలకు లేదు. స్త్రీలు సైన్యంలో సేవ చేయడానికి పోయినపుడు అచటి పురుషులు, వారిని సైనికోద్యోగులవలె గౌరవించి సలాంచేసేవారు. ఆస్పత్రులలో చికిత్సనొందుచున్న సిపాయీలకు స్త్రీలు నర్సుపనులుచేసి వినోదం ఉత్సాహం కలిగించేవారు. అక్షర జ్ఞానంలేని సిపాయిలకు చీనాస్త్రీలు ఆస్పత్రులలో పాఠాలు చెప్పేవారు.

యుద్ధంవలన చీనాలో పెద్ద పరిశ్రమలు చాలా నాశనమయినాయి. గృహపరిశ్రమ కేంద్రాలు స్థాపింపబడినవి. అందులో స్త్రీలు పనులలో చేరి ఆర్జించుకుంటూవుంటే, వారిమగవారు సైన్యంలో చేరి దేశంకొరకు యుద్ధం చేస్తున్నారు.

చీనాలో క్రొత్త ఆవేశం కలిగింది. చీనామట్టి త్యాగమూర్తులగు దేశ భక్తుల రక్తంతో పదునైంది. దానిలో భావి సంతతి భాగ్య ఫలమునకై విత్తులు నాటబడుచున్నవి. "విత్తు నాటడమే తలపెట్టాలి కాని ఫలం అనుభవింప ఆశింపరాదు" అని చీనా సామెత. అట్లే ఇప్పటివారు భావి సంతతి సౌఖ్యం కొరకు నాటుచున్నారు.

## బర్మాకు - ఇండియాకు క్రొత్తమార్గం.

వీలయినంత త్వరలో బర్మానుండి ఇండియాకు క్రొత్త మార్గం వేయాలని ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు. అస్సాం ప్రభుత్వంవారు బర్మాప్రభుత్వంతో కలసి యీ విషయం చర్చించుచున్నారని తెలుస్తున్నది. ఆపుడు బర్మాకు పోవలసినవారు స్టీమరులపైనే పోవలసిన అవసరం వుండదు. రైలుపైని రోడుపైనిగూడ ఇండియానుండి పోవుటకు వచ్చుటకు వీలుండును.

## 103 శత్రు విమానాలు ఒక వారంలో పోయేయి.

గతవారంలో పశిఫికు సముద్ర ప్రాంతములందు కాక యితర దేశాలలో యుద్ధరంగాలయందు మొత్తం 103 శత్రు విమానాలు కూలిపోయినాయి. పశిఫికు ప్రాంతంలో యుద్ధం ప్రారంభమయినప్పటి నుండి 661 జపాను విమానాలు కూల్చబడినవని అంచనా వేయబడెను.

ఇంగ్లీషువారి విమానాలు పడమటి యూరోపులో 46, మధ్యధరా సముద్ర ప్రాంతమున 23 పోయినవి.

## ఇండియానుండి సామ్రాజ్య దేశాలకు విశేషంగా సరకు పోవుట.

## యుద్ధం రెండో ఏట ఇండియా విదేశ వ్యాపార వివరములు.

బ్రిటిషు సామ్రాజ్యమునందు, ఇంగ్లాండు స్కాట్లాండు తప్ప తక్కిన దేశాలన్నికూడ ఇండియానుండి చాల ఎక్కువ సరకును యుద్ధం రెండో ఏట తెప్పించుకొన్నవి. అంతకు ముందు రెండు వత్సరాలకన్న 1940 సెప్టంబరునుండి 1941 ఆగస్టాఖరువరకు యీ విదేశ వ్యాపారం విలువ చాల ఎక్కువగ నున్నది.

నౌకలు చాలక ఇంగ్లాండుతో వ్యాపారం తగ్గిపోయింది అయినా నూనెవిత్తులవంటి ప్రత్యేక సరకు ఆ దేశానికే ఎక్కువగ ఎగుమతి చేయబడినది హాంగుకాంగు, దక్షిణాఫ్రికాల వ్యాపారంకూడ యీ రీతిగనే విశేషంగా వృద్ధిపొందినది. యుద్ధం ప్రారంభమయినప్పటినుంచి ప్రభుత్వంవారు డిఫెన్సు సర్వీసుల అవసరంకొరకు దిగుమతి ఎగుమతిచేయు సరకుల సంఖ్యలు సాధారణ వ్యాపార సంఖ్యల నివేదికలలో ప్రభుత్వంవారు చేర్చుట మానిరి. ఎగుమతులనుగూర్చి బొత్తిగా చేర్చేవారుకారు. యుద్ధానికి కావలసిన సరకు చాలా ఎక్కువగ ఇండియానుండి విదేశాలకు పోయియున్నది. కావున ఇండియాలో దిగుమతులకన్న ఎగుమతుల సంఖ్యయే ఎక్కువ.

అన్ని దేశాలకన్న బర్మా ఎక్కువగ సరకు తీసుకొన్నది. యుద్ధం మొదటి వత్సరంకన్న రూ. 5,94,00,000 విలువగల సరకు ఎక్కువగ ఇండియానుండి కొనెను. యుద్ధానికి పూర్వం 1938-39 కన్న, మొదటి వత్సరంలో రూ. 7,67,00,000 ఎక్కువ కొనెను. కెన్యాకాలనీతో వ్యాపారం గత రెండేండ్లలో రూ. 1,83,00,000, రూ. 2,19,00,000 వృద్ధి చెందినది. స్ట్రెయిట్సు సెట్లుమెంటులకు ఎగుమతుల విలువ యీ రెండేండ్లలలోను రూ. 1,59,00,000, రూ. 2,45,00,000 చొప్పున పెరిగినది.

భారతదేశం సరకు ఆస్ట్రేలియాకు ఎగుమతి యుద్ధం పూర్వంకన్న నిరుడు 2½ రెట్లధికమయ్యెను. యుద్ధం మొదటి వత్సరంకన్న రెండోవత్సరం రూ. 1,75,00,000 వృద్ధి అగుపడెను. సింహళం, ఏడెను, మారిషస్, జాంజిబారు, పంబా, కనడా, నూజిలాండు, పడమటి ఇండీసు దీవులు అన్నికూడ ఓవిడుకన్న యింకోయేడు ఎక్కువగానే ఇండియానుండి సరకు గైకొన్నవి. వాటన్నింటి విలువ ఆదివరకుకన్న గత రెండేండ్లలోను 3 కోట్ల 10 లక్షలు, కోటి 24 లక్షలు యెక్కువగనుండెను.

బ్రిటిషు సామ్రాజ్య దేశములకు ఇండియానుండి పోయిన వర్తక వాణిజ్య సామానుల మొత్తంవిలువ 1938-39 కన్న రూ. 23 కోట్లు ఎక్కువగానున్నను, యుద్ధం మొదటి ఏడాదిలోకన్న రూ. 3 కోట్ల 50 లక్షలు తగ్గిపోయింది. 1941 వ సం॥ ఆగస్టు 3 వ తేదితో అంతమయ్యే వత్సరమున సామ్రాజ్య దేశాలకు ఎగుమతుల విలువ రూ. 120,89,81,723.

విదేశాలకు ఎగుమతుల విలువ 1938-39 లో 84 కోట్ల 13 లక్షలనుండి, తరువాత వత్సరం రూ. 88 కోట్ల 69 లక్షలకును, అటుతరువాత రూ. 66 కోట్ల 49 లక్షలకు తగ్గిపోయెను. వాటిలో అమెరికా, ఈజిప్టు ఇరాకు, అరేబియాలు భారతదేశ ఎగుమతులలో ఎక్కువభాగం గైకొన్నవి. విశేషవృద్ధిగలదు.

స్విజరులాండు, ఇరాను, సుమిత్ర, బోర్నియో, జావా, తాయిలాండు, దక్షిణ అమెరికాలు యుద్ధం మొదటి ఏడాదిలో కన్న రెండో ఏడాది తక్కువసరకు తెప్పించుకొన్నను, యుద్ధంపూర్వం కన్న ఎక్కువే గైకొన్నవి. స్పెయిను, టర్కీ, ఫ్రెంచి ఇండో-చీనా, జపాను, చీనా, పోర్చుగీసు, తూర్పు ఆఫ్రికా, పడమర దీవులతో వర్తకం తగ్గిపోయింది.

బ్రిటిషు సామ్రాజ్య దేశాలకు, విదేశాలన్నింటికి కలిపి ఇండియానుండి ఎగుమతియైన సామానుల విలువ యుద్ధం మొదటి వత్సరం రూ. 212,63,00,000 ఉండెను. రెండోఏడు రూ. 1,87,39,00,000 ఉండెను.

తినుబడి పదార్థములు, త్రాగే వస్తువులు, పొగాకు ఎగుమతుల విలువ 30 కోట్ల 4 లక్షల నుండి రూ 36 కోట్ల 72 లక్షలకు పెరిగెను. పోస్టలు సామాను 1 కోటి 32 లక్షలనుండి 1 కోటి 56 లక్షలవరకు పెరిగింది. పూర్తిగనో కొంతవరకో యిచట తయారయిన వస్తువుల ఎగుమతి విలువ రూ 51 కోట్ల 75 లక్షలనుండి రూ 42 కోట్ల 81 లక్షలకు తగ్గెను. ముడి పదార్థముల ఎగుమతి విలువ రూ 55 కోట్ల 43 లక్షలనుండి రూ 36 కోట్ల 80 లక్షలకు తగ్గెను.

ప్రత్తినూలు, రబ్బరు సామానులు, వస్త్రములు, కాగితం, పేస్టుబోర్డు, వ్రాతసామానులు, రసాయన పదార్థములు, కత్తులు, ఎలక్ట్రికు సామానులు, లోహం ఇనుము ఉక్కు, గాజుమున్నగు సామాను లన్నిటి ఎగుమతిగూడ వృద్ధి పొందినది.

### సామ్రాజ్య దేశాలనుండి దిగుమతులు.

సామ్రాజ్య దేశాలనుండి ఇండియాకు దిగుమతుల విలువ యుద్ధం రెండోయేడు రూ 99 కోట్ల 44 లక్షలుండెను. మొదటి యేడు రూ 92 కోట్ల 76 లక్షలుండెను. కనడా, కెన్యా, ఆస్ట్రేలియా, స్ట్రెయిట్సు సెట్లుమెంట్సు, సిలను, బర్మా, దక్షిణ ఆఫ్రికా, యితర బ్రిటిషు రాజ్యములన్నింటినుండి వరుసగా దిగుమతులు పెరిగినవి.

విదేశములనుండి దిగుమతుల విలువ నిరుడు రూ 75 కోట్ల 70 లక్షలు, మొనిరుడు రూ 68 కోట్ల 59 లక్షలుండెను. అమెరికానుండి దిగు

మతులు 9 కోట్ల 0 లక్షలనుండి 16 కోట్ల 38 లక్షలకు పెరిగిపోయినవి. చీనానుండి 9 కోట్ల 65 లక్షలవరకు పెరిగెను. తాయిలండు, పోర్చుగీసు, తూర్పు ఆఫ్రికా, ఇరాకు, బోర్నియోల నుండిగూడ దిగుమతులు హెచ్చెను.

యుద్ధం రెండోయేడు ఇండియాకు మొత్తం దిగుమతుల విలువ రూ 1,75,15,00,000 మొదటియేడు రూ 1,61,35,00,000 ఉండెను.

ముడి పదార్థముల దిగుమతులు రూ 703 లక్షలు పెరిగెను. వీటిలో కాయగూరలు, లోహములు, చమురు, రబ్బరు, విత్తులు, గింజలు, మైనం, రద్దుప్రత్తి, జట్టు, ముడిఉన్ని, క్రర, కలప దిగుమతులుగూడ హెచ్చినవి.

పూర్తిగనో కొంతభాగమో తయారయిన సరకుల దిగుమతుల విలువ చాల హెచ్చినది. బహుశ ధరలు పెరుగుటచే విలువ వృద్ధియై యుండును. వీటిలో రసాయనములు, మందులు, రంగులు, ఇనుము ఉక్కు, కాగితం, రబ్బరు వస్తువులు, వాహనములు, నూలు మున్నగునవి గలవు.

చివరకు ఎగుమతులు దిగుమతులను తైఫారు వేయగా ఇండియాకు అనుకూలంగా ఎగుమతులు హెచ్చిన విలువ రూ 12,29,00,000 రెండోయేడున్నూ, రూ 51,28,00,000 మొదటియేడున్నూ వుండెను.

---

# సంఖ్యాలు - సమాచారములు.

70 లక్షల గోనె సంచులు తూర్పుదేశాల గ్రూపువారు ఇండియాలో 1941వ సం॥ ఏప్రిలు నుండి సెప్టంబరుమాసముతోగా కొన్నారు. యుద్ధావసరములకు 50,000 సామానులు కావలసియుండెను. అందులో ఇండియా 37,000 సరఫరా చేయగల్గెను. ఔషధులలో 350 రకాలు యిదివరకు విదేశాలనుంచి తెప్పిస్తున్నవి, యిపుడు ఇండియాలో కొంటున్నారు.

* * *

బెవిను శిక్షణ విధానం ప్రకారం యిదివరకే కొంతపని తెలిసినవారికి ఎక్కువ పరిశ్రామిక శిక్షణము ఇంగ్లండులో ఒసంగబడుచున్నది. తొమ్మిది నెలలు వీరికి ఇంగ్లండు కర్మాగారాలలో పని నేర్పుతారు. 50 మందిని జట్టుగా ఒకొక్కసారి ఇండియానుండి పంపుచున్నారు. ఇప్పటికి మూడు జట్లు ఇండియానుండి వెళ్లినవి, నాలుగోది త్వరలో బయలుదేరును. మూడేసి నెలల కొకసారి క్రొత్త జట్టువారిని ఎంచెదరు.

* * *

చేతినేత వస్త్రాలు రూ 9,56,000 విలువగలవి 1939-40 సం॥లో వివిధ రాష్ట్రములందలి చేనేతపనివారి సంఘాలు విక్రయించినవి. చేమగ్గాల సరకు అమెరికా, కనడా, ఆస్ట్రేలియాలందు ఎక్కువగా చెల్లుబడియగుచున్నవి. ఇండియాలో గవర్నరులు వైస్రాయి మందిరాలందుగూడ యివి కొంటున్నారు.

* * *

ఆస్పత్రులలో మంచాలు ఇంగ్లండులో జనసంఖ్యనుబట్టి 600 మందికి ఒక మంచం చొప్పున వున్నవి. లండనులో 200 మందికి ఒకటి. బొంబాయిలో 128 మందికి ఒకటి చొప్పున, కలకత్తాలో 263 గురికి ఒకటి చొప్పున గలవు.

* * *

హైదరాబాదు నైజాంగారు మరో రూ 20,00,000 ఒక కార్వెటి నౌక నిర్మించుటకై బ్రిటిషు నౌకా శాఖవారి కొసంగిరి. ఇదివరకు నైజాం వైమానిక దళం ఏర్పాటు చేయుటకు మొత్తం రూ 13,50,0 0 లున్నూ, వాని సాదరు ఖర్చులకు 50,000 పౌనులును యిచ్చియుండిరి.

* * *

యుద్ధం ఇండియాలో వ్యవసాయమునకు ప్రోత్సాహం ఒసంగెను. అన్ని ప్రాంతాలలో పొడుగు కురుచ స్టేపిలు ప్రత్తి పండించుటకు వ్యవసాయ పరిపాలన శాఖలవారు కృషిచేయుచున్నారు. దీనిఫలితంగా యుద్ధానికి అవసరమయిన వస్త్రములు విశేషంగా ఇండియా మిల్లులలో తయారగుచున్నవి. ఆ మిల్లులు యీ ప్రత్తిని విశేషంగా కొంటున్నాయి.

* * *

ప్రభుత్వంవారి వస్త్రకర్మాగారాలందు యిపుడు నెలకు 80 లక్షల దుస్తులు తయారగుచున్నవి. తోలు వస్తువులుగూడ ఆ ప్రకారమే తయారు చేయించబడుచున్నవి నెలకు రూ 125 లక్షల విలువగల సరకు తయారగుచున్నది.

---

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.